"వత్సా, మెచ్చితి భవదీయ వస్తుతతిని
శతకరూపానఁ జొప్పించి శరణుఁ జొరితి
వదియు యిడు నాకు సంకీర్తమాలర సిరులు"—
అనుచు సదృశ్యమైన నీయానమెయిని
విగతసంచితపాపినై వేడుదు నిను,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 3

వక్కలంక శ్రీనివాసుండు శతకంబు
కుక్కుటేశభర్తఁ గూర్చి రచన
సంతరించె; బుధులు సాదరస్వాంతున్నను,
గొని శాసంగఁ గర కరము వేడు!

రాజరాజేశ్వరీనేత, రమ్యగతిని
స్వీకరింపంగ, రా, తండ్రి, సిద్ధసేవ్య,
నీదుశతకంబుసంకితమిదిగోఁ గొనుచు
నెరసులున్నను మన్నించు నిటలనేత్రి!
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ!!





శ్రీరస్తు

శ్రీః

# కుక్కుటేశ్వర శతకము.

సుజనసన్నుతు విఘ్నేశు, సుందరముగ
మదిఁ ధ్యానించి భారతిన్ మఱినుతించి
శతకమును వ్రాయఁదొడఁగితి, శరణుగొనుము;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 1

అరయ స్వభాను చైత్రము అష్టమితిథి
శుక్లపక్షాన నీకృతిశోభఁదనిసె;
చిత్తగింపుమ శ్రీకంఠ, చిద్విలాస,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 2

సుగతినొప్పాఱు గౌతమీసురవరతట
పులినస్థిత "పాదగయ" పార్శ్వపుణ్యమూర్తి,
వందనము, శూలి, భక్తాళివశవినోది !
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! ! 3

జడుడ, మాయను సర్వంబు సంతరింప
కుహనవృత్తి నిమెలగెడి కష్టితుండ,
కామసక్తుంచరిక్ష గూల్చి కావ, శరణు;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 4

క్రోధతిమిరంబు, త్రిపురారి, కోరిసన్ను
మన్నుమిన్నునుగననీక మమతసీడ్చు,
శరణుదయచేయు, శివ, నీమాసరసఁగొంత;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 5

లోభగుణమొందు ద్రోలి, సులోలితము గు
తావకీయాద్భుతంబగు దర్శనమును,
దేవ, నాకీయనర్థింతుఁ దిరముతిసిను;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 6

మోహవాగురఁజిక్కితి, మునులకైన
గాఢతపచర్యనొక్కంతఁగానరాని
నీదురూపంబుజూడంగనేర, శరణు;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 7

మదము మైఁగప్పి, ఈశ్వరా, మఱచితిని,
పీఠికాపురవాసిగాఁ బేరువడుట,
శరణు శీఘ్రము నాతప్పు సైచుకొనుము ;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 8

పొంచి, మాత్సర్యమలరి, నన్ బాందకుండ,
దాఁగి తవసేవఁ జేయింపఁ దడయుచుందు;
నీకు శరణంటి, సర్వంబునిత్తునంటి;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 9

ధన్య మాన్యుని కైలాసదాయి నిన్ను
శరణటంచును వేడితి, శక్తిఁ జూపు
దురితపంకంబు నింకించు దొడ్డదొరవు;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 10

పూర్వజన్మాన గలిగిన పుణ్యలేశ
మెద్దియో, శూలి, చెప్పంగ నెఱుకలేను;
తావకీయకృపాంబుధిఁ దనుపఁ శరణు;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 11

వర్ణితులను ధ్యానమున విన్నబెట్టఁ జేసి
కుసుమరాశిని నర్పించికొందు శరణు
దావకీయమనోహరధ్యానమొసఁగు
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 12

శూలి, భవనాశ, నీనామసూక్తి నరయు
దాసజనకోటి బాములు దరుమబడవె?
శరణు, నన్నేలు నీదాసు సరభసగతి,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 13

పరగ దక్షిణకాశినాఁ బ్రొద్ధిగనిన
పీఠికాపురి నివసించి పేరువడితి;
శరణు, రాజేశ్వరీనేత, శక్తిదాత!
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ!! 14

అరయ కాలంబు జనుచుండె నతివడి గతి
ననుదినంబును నాయాయువణచివైచి;
చింతిలని నీకు మొక్కుదు, చిత్తమరయు;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 15

నాదబ్రహ్మము నీవయై నాట్యమాడి
శరణటంచును, బశుపతీ సాగిలఁబడుదును;
ఇంతభాగ్యంబొసంగుట కీవె గతివి,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 16

వేగఁదమి "పాదగయ" స్నానవిధిని దీర్చిఁ
"హరహరా! నీలగళ, పాహి, హారతి," యను
భక్తజనసంఘలార్భటిఁ బాయదు చెవి,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 17

మాతరాజేశ్వరీదేవి మహిని గూడి
సతము తవ పాదసంసేవ సలుపనిమ్ము;
దోసములఁ బాపు నేతవు, దొరవు, శరణు;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 18

పాతకము వాయు, భక్తులప్రాపుగలుగు,
సిరియు సంపదలెలమిని సిద్ధిగనును,
శరణు ప్రమథేశ యని నీకు సాగిలగను;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 19

నానిజన్మంబు ధన్యము, నానిబ్రదుకు
నతికి మూలంబుగద, నిన్ను నుజ్వలమతి
సేవచేయుచు శరణంచు శివ యటన్న;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 20

దేవ, రాజేశ్వరీనేత, దివ్యభూతి
నలరు నాతేఁడ, మామకాఘవిదూర,
భక్తజనపోషిడ, పాహిమాం, పరమపురుష,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 21

నీలగళ, బిల్వపత్రంబు నిశ్చలమతి
పాణితలముననిడుకొని ప్రణతిసేతు,
మంగళము, శోభ, యశవల్లి, మనుప, శరణు;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 22

దేవ, నీయాలయంబునం దెదుట వెలుఁగు
నందికేశుఁడు సతతంబు నర్చనమున,
దమినిశరణంచునీమూర్తిఁ దలతునెపుడు;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 23

గర్భగుడిఁజొచ్చి, టెంకాయఁగరముఁగొట్టి
హారతిస్వీకరించి మోహాంపురూప,
పాహిమాం శూలి, యను భక్తుఁ బాలనఁగాను
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 24

భక్తజనభాగధేయ, సుభాగ్యచరిత,
పాపజనులను క్షమఁ జూచు భవవినాశ;
నీచుఁడను నన్ను నీకృప నేల శరణు;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 25

అగణితంబగు దోషంబు లావరింప
మత్తనాగముభంగి నే మసలినాఁడ,
దేవ, తవరూపసందర్శదీనుపి గను,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 26

హే మహాదేవ, కూటేశ, హే కృపాళో,
నందివాహన, సురబృంద, నగజనేత,
శంకరా, నీమపథమున సమయు, శరణు,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 27

సంకటంబును బూర్చి, శరణంచు, శర్వ, దేహి,
"మాం కృపాసన" యను భక్త మనుజుఁడొకఁడె
దేవ, తవ పాదపద్మముల్ తెలియువాఁడు,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 28

పీఠికాపుర దరి నున్న పిత్ృవనము
ఆంధ్రసీమయ శరణన్న యముఁనాటి
"పాదగయ" పజ్జ నీమూర్తి బహుసుకీర్తి,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 29

రాజరాజులు అలరెడు రమ్యభూమి
ధరను రాజేశ్వరీదేవి, ధర్మగేము,
"పాదగయ" పార్శ్వవర్తియై బరగుటరుదె!
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 30

జనిత మమ పాపపుంజముల్ చనను నేఁడు
శంకరా నీదు స్తోత్రింబు సాగుకతన
భావి సుగమంబు జేయు, మాం పాహి, దేవ,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 31

కలినచిత్తుఁడ, నున్మత్తకరణి జనెడి
పాంథుఁడను, జీవయాత్రచేఁ బడలితి, ప్రభు;
శూలి, నిర్గతమమపాప, సూడు విడుము;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 32

భక్తులకు, శూలి, వశుఁడవై బరగుకతన
గరళగళ, నిన్ను దర్శింత్రు గడుసుకృతులు,
భక్తజనలభ్య, మాం పాహి, పతితనాశ,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 33

తమిని నీ దర్శనార్థమై తరలు జనులు
విగతదోషులు "గయ" స్నాన విమలమతులు,
పారతుల నేత్రసాఫల్యపారగతులు,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 34

కోరి శివరాత్రినీయింటఁ గూర్మిఁ జరుగు
కోటి శతపత్ర పూజలఁ గొలిచి దిరుగు
దాసుఁడను, నీకు శరణంచు దండమిడితి,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 35

చంద్రమౌళికిఁ, బిల్వంబుఁ జాలఁ దెచ్చి
లక్షగాఁగల పూజను లలితగతుల
నాచరించుచు శరణంచు నతి మొనర్చు
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 36

కోరికలఁదీర్చి తమిఁ గూర్చి, కూర్మినగుల
మన్ననలనంది, మొక్కుల మనుచు దైవ
మొక్కఁడవెనీవు, మాం పాహి, ఉడుపతిధర,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 37

ఎన్ని కష్టాల మునిగిన, నెచటనున్న,
నెట్టిబాముల వ్రణముల సీల్గుచున్న
తఱిని, నీనామస్మరణంబె తారకంబు,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 38

"పాదగయ" విష్ణుపాదాలఁ బరగుసలిల
మంచు మజ్జనమాడుచు ననవరతము
నిన్ను నర్థించు జనులకు నీవె శరణు;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 39

బేసికన్నులప్రోడ హో, భేషు, నీదు
చరితమింతనికొనియాడు చతురులెవరు
వాణీపతిగాక, దాసుల వశమె పొగడ,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 40

ఎవరు నిరతము హర యంచు నెలుగురవము
నిన్నుఁ గీర్తించి నృత్యంబు నేర్తురో, ప్రభు,
కాలకంధర, వారలఁ గరము మనుచు,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 41

నారికేళజలంబున నధిక తమిని
భక్తి నభిషేకమెవ్వఁడు బాదుకొల్పు,
వాఁడె తవమూర్తి శరణంచు వనరువాఁడు,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 42

మాతరాజేశ్వరిని గూడి మఱువకు మము,
నీదు పదధ్యాననిరతిని నిలుప శరణు,
కంటి నిను, నాదుగతజన్మకార్యమేమొ,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 43

అరయ మాయను జొప్పించి యాటలాడు
పితృవనవాసి, పునుకలపేరదేల,
విడిచి రావోయి, మాకోడ వింతుఁ గుడియు,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 44

పన్నగాలెన్ను ఱేడ, నా పాపు నీవ,
జన్మజన్మాలకరయంగ జమడు గాని
నిన్ను జింతింప, శరణన్న, నీ పదమిడు,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 45

అర్థివీవను నుడులకే హర్షమంద
దాతవీవౌచు భక్తాళిఁ దనుపుకతన,
శంకరా నీకు శరణంచు, సాగి మ్రొక్కు,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 46

చపలమతి, నాగభూషణ, జమడనగుచు
గొప్ప యపచారతతి నిన్ను గొలువనైతి,
నాదు యఘముల సైరింప, నంజలి యిదె,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 47

పతితుఁడను, నిక్కువక్కటా, యే పాపిఁబుగాన,
తావకీయార్చనను గొంత తెలియు, నాకు
దోసముల లెన్నఁగాఁ గాచి త్రోవఁ జూపు,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 48

విప్రవంశుండ, నాసాటి వేదవిదులు
ధరణి శేరన్ను మదమున దనియుచుందు,
జ్ఞానబోధను నిను గాంచి కరముమోడ్తు;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 49

అలి యధిపుని బ్రీతిమై నరయునట్లు
తండ్రిఁ బాడగాన నేరని తనయుని వలె,
వెదకుచుంటిని శరణంచు విజ్ఞుని నిను,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 50

అభవ, తవదృష్టిసోకిన యల్పుఁడెటుఁగ
తావకీయంబులైనట్టి ధర్మపథముఁ
బొందఁ జాలునటన్నచోఁ బోదె భయము;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 51

అరుత రుద్రాక్షజపమాల, అగ్నిముద్రను
యాగవాటిక, పాణిని యతులయష్టి,
లింగరూపము నివియ నీ లీలఁదార,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 52

వరములడుగుము దేవేశ, వాంఛఁ గనను,
ద్రవ్యరాసుల నర్థిమై దరికిఁ బోను,
నిచ్చలీమూర్తి మది నిల్పి నెఱఁగుదు, శివ;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 53

అరయఁ బంచాక్షరీమంత్రి మదియె చాలు
పఠన నిరతంబు సలుపంగఁ బ్రౌఢి గనును;
జీవుఁడాత్మను నిను జింత చేయువలయు,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 54

పతితపావన వెలసితి "పాదగయ"ను
* వాటికను నిత్య నరధూమవాసనఁగాని,
మనుదు రాజేశ్వరీదేవి మంతనమున,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 55

---

* స్మశాన భూమియందు

లెక్కఁగాదెన్న మృడ నీదు లీల లిలను
దాసతతి నిచ్చలీ చెంతఁ దనియుచుంట
కనులపండువ, అదిగాన గలుగు ముక్తి,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 56

హే పరిపన్నార్తిహర, శంభు, హేకృపాళో,
పాహి మాం, భక్తజనపాల, పాహి, శర్వ,
మామకంబగు భవపాశమణపఁ బ్రణుతి,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 57

పుడమియందున వృక్షాది భూతములకు
నాశ్రయుఁడవౌచు భూతాధినాథువగుచు
బరగు మృత్యుంజయా నీకుఁ బాహి, పాహి,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ !

అరయఁ దన వక్త్రమందెసఁగు నఖిలభూత
దేవగణ యక్ష రాక్షస దివ్యతతుల
నిరతమును గాచు శూలి నా నెనరు నీవె,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 59

భ్రాంతిచే రజ్జువును జూచి పన్నగమను
మూఢనరునట్లు శ్రీకంఠ మూర్ఛవడితి
తావకీయాద్భుతంబగు దర్శనమున,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 60

దేవ, తలపంగ, నీ పృథ్వి తేజమెల్ల
నీవయై లోన వెలుపల నిండితి గద!
తవమహీమలుగానని తనువు సున్న,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 61

చంద్రమౌళిరో! నీయందుఁ జక్క నున్న
లోకజాలంబులెల్ల నీ లోలితములు,
దేవ, తవమాయ నెఱుగని దీనుసిఁ గను;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 62

రజ్జుభ్రాంతిని నాగంబు రహితమెట్లో,
ప్రాణులకు నెల్ల భవపాశ భయముదట్లు,
పొసఁగుచుండును నీమాయ పృథివి లోన,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 63

నీవ సర్వంబు తత్కార్య నిచయమంత
సరయ మృష సుమ్మ గౌరీశ! యదియ మాయ;
దాన జరియించు జడుడ, నా దారి చూపు,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 64

అడియ సూనృత వాక్యంబు, అదియ ఘనము,
అదియ సువ్రత ఫలితంబు, అదియ పరము,
ఎద్ది నీకంటె వేఱుగా నెసగ లేదొ,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 65

పాగ్వతీపతి, యజ్ఞాన పతితక్రియల
సంతసించెద వీవను సాకు వార్త,
కల్లసూ, నీకు భోగేచ్ఛ కలదె, యరయ;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 66

దళము, పుష్పంబు, తోయంబు, దమిని గూడి
యర్పణము నీకు లేశంబటంచు నిడిన
నీదుభక్తునివలె నన్ను నిక్కమరయు,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 67

ఆదిపురుషుండవీవౌట, నంతనుంట,
నాశనంబేల కలుగు నీ నటన యందు;
అభయమునకుఁ బోలె శాశ్వతమైన రూపి,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 68

అర్కుఁ డాకాశమందుండి యన్ని గతుల
ఒక్కరుండయ్యు పాత్రిల నొరయు నీట
గానబడుభంగి వేర్వేఱు గతుల నుండు;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 69

జగము పుట్టింపఁ బెంపను జంపను గతి
నీకుఁ గల్గెడిదేమొకో, నీలకంఠ,
స్వప్నమున దేహి సంతస స్వానుభవమె;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 70

త్రిపురసంహారి జీవుల దిరముఁ జేయ
లోకజాలంబు నీవుగా లోకమైతి
వంతియే, ద్వంద్వరహితుండవార్యమతివి;
కువలయానందకర, శర్వ,కుక్కుటేశ! 71

సచ్చిదంబోధి హంసవై సాగరమున
నిరతకేళిని దేలెడి నీలకంఠ,
మామకంబగు పాపముల్ మాన్పు శరణు;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 72

మహిని, బరమేశ్వరా, నాదు మాటలందు
కటువు గలదేని, మన్నింపు, కరుణఁజూపి,
అరయ నెఱుఁగుదు నీ మ్రోల నంజలిన్నిడి,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 73

పశుపతీ మోయజాల నీ భవజలధిని,
క్రుంగి, నీమాయ నెంతయో కూలఁబడితి,
మామకీయార్తి దీర్పు మోమైన జూపు;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 74

అష్టమూర్తివి నీవాట నరయ జగము
సర్వమును నీదు వీక్షణ సమయుఁగాదె !
రుద్రి, గుణభద్రి, శాంతంపురూపసివవు,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 75

భూతపతివౌటc, దెల్లంబు భూజనులకు
నీదు వాత్సల్యమెల్లెడ నిండియుంట,
దాసవర్యులకరయ మందారమీవె,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 76

భర్గ, ప్రమథాధిపా, నీదు పాలనమున
సించుకైనను లోపంబు నెఱుకపడక
శాశ్వతానందవీక్షణసముడవైతి;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 77

సూర్యశశినేత్ర, పావక శోణవిలయ
దృక్కు వెలువడనీయక దురితచయము
బోకడంచుము నీ దాసబృందమెన్న,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 78

వేకువను "జాహ్నవీనేత, విశ్వనాథ,
పాహిమాం" యన్చు ధ్యానించు పతితునైన
దమిని లాలించు కైలాసదాయి, ప్రణుతి,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 79

"భక్తవత్సల! పరమాత్మ, పతితదూర,
సాంబశివ!" యన్చు కేలెత్తు శ్వపచునైన
బ్రోచెదఁట; నన్ను గాపాడి బ్రోచుటెంత?
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! ౮0

అనుదినము భూతి, రుద్రాక్షులఱుతఁదాల్చి
"శంకరా, పాహిమాం" యన్చు సన్నుతించు
నీదు భక్తులతోఁ గూడి నిన్నె దలతు,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 81

సాంబశివ, రమ్మ నను గావ సత్వరమున,
రజితగిరినున్న భూతాలరాశి నున్న,
పితృవనమున నిలిచిన ప్రేమ తోడ,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 82

భక్తవత్సల, తవదృక్కుపాత్రనేని,
లేమి శోకించు నరుఁడైన లేచి, భక్తి,
కేలుదోయిని నీకుగాఁ గీలుకొనును;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 83

తమిని హస్తీశ్వరా యని దగిలి పోఁక
నిరతమర్చన నిర్జ గూర్చి, నిల్చువాఁడె
నిక్కముగనుండు కైలాస నిలయమునను;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 84

శ్వపచుఁడరయఁగ నిష్ఠను, సద్గతిఁ గన
భూతపతి, నీదుకీర్తన బ్రొద్దుపుచ్చు;
విప్రకులజుండు నీకేల వెఱువడొక్క ?
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 85

"పాదగయ" మజ్జనంబాడఁ బాల్గొనుదురు
వైష్ణవులు శైవులెల్లరు వఱుత నరిగి;
ఏలకో నిన్ను వైష్ణవుల్ ఎఱుగరారు ?
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 86

తారకాంతక, నీమూర్తి దర్శనంబు
దుర్లభంబంచుఁ బ్రమథులు దృటినివ్రాలి
పీఠికాపురి నిలువంగఁ బేర్మి యేమొ ?
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 87

శంకరా, నీదు పరిచయస్వాదుదృష్టి
సోఁకు నెపమున నాసతో సూఁచు విడిచి
నిన్నె నామది నాటంగ నిలుపువాఁడ,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ !

మందుఁడనుగాన, నాచర్య, మాటనేర్పు,
వెగటుగొల్పిన సైరింపు, విశ్వనాథ !
విడువజాలను నిను, సామి, వెఱ్ఱినగుట,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 89

పూర్వభవమున నా పుణ్యపుంజమునను
జేసి కాఁబోలు నీభక్తి చేరెనన్ను;
కాక, నిను గీర్తనలవేడఁ గడకగలదె ?
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 90

స్థానురూపుఁడవాటనొ, శక్తిఁ దెలియు
నెపముననొ, గాని, నాకీశ నీవు గనవు,
లెస్స; పరికింపఁదలచుట నీదులీల;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 91

భూతపతి తావకీయ విభూతి నెల్ల
నరయ నే నెంతవాఁడను, అతులగతుల
దాయివీవను నుడి దక్కఁ దనియను మది;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 92

ఏలకో చింత నరులకు, ఎఱుఁగలేను,
ధాత్రి నినుబోలు దైవంబు దాతయుండ,
నన్యభూతులఁ గొనియాడు యాశ యేల?
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 93

పినికినే గాని, పశుపతి, విమలచరిత
కుక్కుటాకారు నీరూపుఁ గూర్మి నెఱుఁగ;
తెలిసితిని నేఁడు తవభూతిఁ దీక్ష్ణమహిమ;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 94

పీఠికాపురవాటిక, ప్రేమ ధన్య,
స్వామి, తవమూర్తి నిచ్చలు సాగుకతన;
భక్తులకుఁ గొంగుబంగారు "పాదగయ"యు;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 95

నిచ్చలేమానవుఁడు తవ నిర్మలంపు
"పాదగయ" స్నానమాడి నిన్ భక్తిఁగొలుచు,
వాఁడెపో ధన్యుఁడరయ నీవాసమంద;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 96

"చంద్రునకునూలుపోగ"ను చందమునను
రచన సాగించి గీతాలరత్నహార
మెలమి నర్పించుకొంటిని, ఎటులఁగొనుదో!
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 97

దాసజనులకు భక్తమందారమనఁగ
సుకవికోటి నుతించెడు శూలినాఁగ,
రాజరాజేశ్వరిఁగూడి రహి వెలసితి;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 98

పుణ్యశీలురు తవమూర్తి పూర్వగతజ
కర్మవాసన గలవారె గాంచువారు;
కలుషమతులకు తవసేవ గలుగునెట్లో?
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 99

శరణు శంకర, పాపులశమన, దేహి,
మాం కృపావన, వందనమయ్య, శర్వ,
నన్ను క్షమియించి భవజన్మనాశమొసఁగు
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 100

శతకమాలను నా నేర్పు శక్తిఁ గాలేది
దేవ, తవకీర్తి వినుతించి, తీర్చితి విధి,
దోషపుంజంబులున్నచోఁ దోలి బ్రోవు;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 101

అరయుగా నిందువారము, నధికతమిని
మాసశివరాత్రి, నుపవాసమతిని ధ్యాన
మెలమి నిను నిల్పుభక్తునకేమికాదువ ?
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 102

భవజలధినీదుకొనుచును భక్తవరులు
తావకీయాంఘ్రిసరసిజధారమధువుఁ
గ్రోలుచుండుట, వారితోఁ గూర్మిమెలఁగు;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 103

కుక్కుటాకార మామక కూర్మిమనము
వేగ నీయంద చిగిరించి విరియునట్లు,
వరము దయచేసి నీ లోక వసతినిమ్ము;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 104

రాజరాజేశ్వరీదేవిరమ్యహార్మ్య
డోలికలఁగూడి, మృడ, కేళినొయిఁగొనెదొ,
విస్మరించెదొ, నా మొఱవినెదొ, లేదొ,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 105

సాంబశివ, మోదమల్లార సాధుజనుల
కండయై నిల్చి వసుధను, అనుము శాంతి,
భక్తులకు నెల్లకామ్యముల్ బాదుకొలుపు;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 106

నియమమును బూని సర్వంబు నీకె యన్చు,
అర్పణము సేయునెవ్వఁడు అధికతముని,
అతనికొసఁగుము సర్వేశ! అమలపథము;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 107

ఏనరుఁడు భక్తి తోఁ గాక సంపుమీఱ,
కుక్కుటేశ్వరు శతకంబుఁ గోరిచదువు
నతనికిచ్చెదగాతపీవమలపథము !
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ ! 108

సాంబశివార్పణమస్తు. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

## గద్యః

ఇది శ్రీరామచంద్రకృపావశాలోకనపవిత్రకవితా
విచిత్ర, భీమరాంబికా రామలింగేశ్వర
రత్నార్యపుత్ర, భారద్వాజసగోత్ర
సుజనవిధేయ శ్రీవక్కలంకశ్రీనివాసరాయ
ప్రణీతంబైన కుక్కుటేశ్వర
శతకమునందు సర్వమును
సంపూర్ణము.



శ్రీ ఆనంద తీర్థ ప్రెస్, రామచంద్రపురం.